# “నేను"

ప్రతివాడు తనలోని ఆత్మను గుర్తించుటకు సులువైన మార్గాన్ని శ్రీ శంకరభగవత్పాదులు ఒకే శ్లోకంలో ప్రశ్నోత్తరమాలికగా కూర్చారు. ఇందులో గురువుగారు ప్రశ్నించడం శిష్యుడు సమాధాన మివ్వడం ఉంది. ఇది ఏకశ్లోకిగా ప్రసిద్ధి చెందింది

కిం జ్యోతిస్తవ భాను మానహని మే రాత్రౌ ప్రదీపాదికం,స్యా దేవం రవి దీప దర్శన విధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే |చక్షుస్తస్య నిమీల నాది సమయే కిం ధీర్ధియో దర్శనేకిం తత్రాహమతో భవాన్ పరమ కిం జ్యోతిస్తదస్మి ప్రభో

గురువు శిష్యుని క్రమంగా ఈవిధంగా ప్రశ్నిస్తున్నాడు. శిష్యుడు దానికి తగినసమాధానాన్ని చెబుతున్నాడు.

గురువు- వత్సా ! వస్తుప్రకాశమగు జ్యోతి ఏదియని నీ యభిప్రాయం

శిష్యుడు- స్వామీ ! పగలు సూర్యుడు, రాత్రి ప్రదీప చంద్రోదయం ప్రకాశానికికారణం

గురువు- వత్సా ! సూర్యచంద్రాదులను గుర్తించు జ్యోతి(సాధనం) ఏది

శిష్యుడు- స్వామీ ! ప్రకాశాన్ని గుర్తించేది నేత్రమేకదా

గురువు- వత్సా ! కళ్ళుమూసుకున్నప్పుడు నీ అంతరంగంలో వెలుగునిచ్చువదేది

శిష్యుడు- స్వామీ ! అంతఃకరణంలోనున్న బుద్ధియేగదా

గురువు- వత్సా ! ఈ బుద్ధిని చూచునది ఎవరు ?శిష్యుడు- స్వామీ ! నేనేగదా

గురువు - వత్సా! నేనే అనునదే ఆత్మ. లోపలను వెలుపలను ప్రకాశిస్తూపదార్థాలను ప్రకాశింపజేస్తూ నీలోనూ, నాలోనూ, నిండి ఉన్న చైతన్యమేఆత్మ. ఈ ఆత్మనే ప్రతివాడు 'నేను' నేను' అని వ్యవహరిస్తున్నాడు.

శిష్యుడు- స్వామీ ! పరంజ్యోతి స్వరూపమగు నాలోన వెలిగే ఆత్మయే "నేనని" తెలుసుకున్నాను. ధన్యుడను

హరి ఓం తత్సత్🌹🙏.